| | |
|---|---|
| లబ్ధ్వా | = పొంది; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| మృదులస్మితాంశులహరీజ్యోత్స్నా వయస్యాన్వితామ్ | = మన్దహాసకాన్తి ప్రవాహమనెడి వెన్నెల యను పేరుగల స్నేహితురాలితో కూడిన; |
| ఆనన్దవీచీమయీమ్ | = ఆనన్దతరంగరూపమైన; |
| అపవర్గసౌధవలభీమ్ | = మోక్షమను మేడయొక్క పై యంతస్తునకు ముందున్న భాగమునకు; |
| ఆరోహతి | = ఎక్కును. |

**తాత్పర్యము:-**

ఎవడు ఆర్యనే విశేషముగా భావించుచు, నెదుట ఆమె పాదార విందమును చూచుచు, స్తుతి నారంభించునో, వాడు తప్పక ఆమె కటాక్షకాన్తిని పొంది, ఆ కామాక్షీ దేవియొక్క మన్దస్మిత కాంతి ప్రవాహమనెడి వెన్నెల యను పేరుగల స్నేహితురాలితో కూడిన మోక్షసౌధము పైయంతస్తుయొక్క ముందు భాగమును చేరుకొనగలడు.

**వివరణము :-**

మూకమహాకవి ఈ గ్రంథమును వ్రాయుటకు ముందు **ఆర్యను** అనగా కామాక్షీదేవిని మనసున భావించినాడు. అప్పుడాయన యెదుట అమ్మవారి **పాదము** కనఁబడినది. అమ్మవారి **స్తుతి** నారంభించినాడు. ఆ స్తుతివలన అమ్మవారి **కటాక్షమా**యనకు లభించినది. ఆ తరువాత ఆయనకు మోక్షము లభించినది. మూకమహాకవికి భూతభవిష్యద్వర్తమానకాలములకు సంబంధించిన విజ్ఞానము కాలాతీతపరమార్థవిజ్ఞానమును లభించినది. మొదటి శతకము పూర్తి కాగానే అమ్మవారి పాదారవిన్దము సాక్షాత్కరించినది. అనగా విశ్వమంతయు భగవంతుని పాదమే యను **మాండూక్యోపనిషద్వాక్యార్థ** మనుభవములోనికి వచ్చినది. ఎదుట కనబడు విశ్వమునే యమ్మవారి పాదముగా దర్శించుచు **పాదారవిన్దశతకము** ముగించినాడు. స్తుతి శతకమారంభించగానే అమ్మవారు తనను కటాక్షించినట్లనుభవము కలిగినది. ఇంతవరకు భూతకాల జ్ఞానము. **కటాక్షశతకము** పూర్తి చేయగానే అమ్మవారి మన్దహాసము వెల్లివిరిసినది. మూకమహాకవి దానిలో మునిగిపోయినాడు. ప్రాణమెప్పుడు పోయినదో కాని తానమ్మవారి మన్దహాసముయొక్క ఉపరిభాగమైన మోక్షసౌధవలభితో తనకు తాను దర్శించుకొన్నాడు. ఇది భవిష్యత్ జ్ఞానము. యత్తత్ శబ్దములయొక్క విభావయన్ పశ్యన్ అను శత్రంతములయొక్క లబ్ధ్వా, యుక్త్వా, అను క్త్వాన్తములయొక్క ప్రయోగబలమున పై వస్తువంతయు వ్యంగ్యమగుచున్నది. రెండు శత్రంతముల పిమ్మట **ఆరభతే** యను వర్తమాన క్రియను ప్రయోగించుటచే అంతకు పూర్వమున్న జ్ఞానము భూతకాలికము. లబ్ధ్వా అను, క్త్వాన్తమున దాని తరువాత భవిష్యర్థక లడంత క్రియ (ఆరోహతి) ప్రయోగించుటచే కటాక్షలాభము మోక్షసౌధవలభ్యా రోహణము

స్తుత్యారంభానంతర భవిష్య జ్ఞానమని స్పష్టము కాకమానదు. ఈ శ్లోకమున ఈ పంచశతి పఠించు వానికి కలుగు లాభమును కూడ వివరించు చున్నాడు. **పంచశతిలో మొదటిది ఆర్యాశతకము. రెండవది పాదారవిన్ద శతకము, మూడవది స్తుతి శతకము నాలుగవది కటాక్ష శతకము. ఐదవది మందస్మిత శతకము.** పంచశతీపాఠకుడు ఆర్యను భావింపవలెను. తత్పుణ్యబలమున మరియు భావనాబలమున పరోక్షవస్తువైన అమ్మవారి పాదారవిన్ద మెదుట సాక్షాత్కరించును. ఆ యనుభూతితో పులకించి యా పాఠకుడు తనకున్న భాషాపటిమతో నామెను పాదాదిగా స్తుతించ నారంభించును. ఆరంభించిన ఆ స్తుతి ఇట్లు పాదారవిన్ద శతకము స్తుతి శతకము ముగియు నప్పటికి అమ్మవారు కటాక్షించినట్లనుభూతి నొందును. ఆ అనుభూతితో కటాక్షశతకమును ముగించునప్పటికి అమ్మవారి మన్దస్మితప్రవాహము మెల్లమెల్లగా బయలుదేరి పాఠకుని ముంచివేయును. మన్దస్మిత పాఠము పూర్తియగునప్పటికి పాఠకుడు బ్రహ్మాత్మజ్ఞానము నొంది జీవన్ముక్తావస్థ నొందును. జీవన్ముక్తావస్థ నొందిన యా పాఠకుడు పునః పునః పంచశతీ పాఠమొనరించుచు దేహపాతా నంతరము అమ్మవారితో నైక్యము నొందును. ఇదియే **కైవల్యముక్తి.** ఒకవేళ బ్రహ్మాత్మజ్ఞానము కలుగక జీవన్ముక్తావస్థ లభింపనిచో దేహపాతానంతరము అమ్మవారి లోకముఁజేరును. ఇది **సాలోక్యముక్తి.** తరువాత అమ్మవారి రూపముతో సమానరూపము అనగా పాశాంకుశేక్షుధనుః పుష్పబాణములు గల చతుర్భుజములు గల రూపమును పొందును. ఆ పిమ్మట అమ్మవారి దగ్గఱకు చేరును. ఇది **సామీప్యముక్తి.** ఆ తరువాత అమ్మవారి ఐశ్వర్యముతో సమానమైన (జగత్సృష్ట్యాది వ్యాపారము తప్ప) ఐశ్వర్యము నొందును. ఇది **సార్ష్టిముక్తి.** ఆ తరువాత అమ్మవారి యాభరణములలో అవయములలో కరణములలో నంతఃకరణములలో ఏదోయొక దానిలో నైక్యమొందును. ఇది **సాయుజ్యముక్తి.** ఆ తరువాత అమ్మవారు గురుస్వరూపిణియై **తత్త్వమసి** యను మహావాక్య ముపదేశించును. ఆ యుపదేశమున సాలోక్యాదిముక్తులలోనే ముక్తిని పొందిన వాడైనను బ్రహ్మాత్మైక్యజ్ఞానము నొందును. అప్పుడు లోకాతీయమైన అలౌకికమైన చిద్రూపిణియైన అమ్మవారిలో నైక్యము నొందును. ఇంతటితో పాఠకుని కథ కంచికి చేరును. భూలోకమున భార్యాపుత్రాదులు తోడుగా నుందురు. వారినందఱను విడచి జీవుడు మరణించును. ఆతడు లోకాన్తరములకు పోవునప్పుడు ఆతని పుణ్యాపాపములే వెంటనుండును. అమ్మవారిలోకమున మాత్రము అమ్మవారి మన్దహాసకాంతి ప్రవాహజ్యోత్స్నయను స్నేహితురాలుండును. ఆమెతో కలిసి మోక్షసౌధవలభియందు ఆనన్దవీచుల నోలలాడును.

**మందస్మితశతకమ్ సంపూర్ణమ్**

**ఓం నమశ్శివాయై చ నమశ్శివాయ ఓం**

**శ్రీః**

# మన్దస్మితశతకమ్ - శ్లోకానుక్రమణికా





శ్రీః



చంద్రశేఖర రక్ష మాం చంద్రశేఖర పాహి మాం

ఈ గ్రంథము

**నాగమోతు క్రిష్‌మిత్ర**

రోచష్టర్ వారి

ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది.